## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120029612

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



"సత్యం శివం సుందరం"



# రత్నత్రయము

గ్రంథకర్త:

పెద్ద మఠము పండిత రాచవీరదేవర "తీర్థ" (కలకత్తా)

M. O. L. ఉస్మానియా యూనివర్శిటీ

సాహిత్యాలంకార్, భాషాప్రవీణ, హిందీ భూషణ,

కన్నడ "జాణ" సంస్కృతాంధ్ర సీనియర్ పండితుడు.

# తొలిపలుకు

"రత్నత్రయము" అను శీర్షికతో వెలువడుచున్న యీ చిఱు పొత్తము 1. శీలము, 2. మితభాషణము, 3 ఏకాంతవాసము, అను మూఁడు రత్నములవంటి వేర్వేరు వ్యాసములనొక రత్నహారముగా గూర్చఁబడినది.

దినదిన మడుగంటుచున్న విద్యార్థులలోని శీలమునుగూర్చి యభివృద్ధి పఱచుకొను మార్గములను ప్రథమ దశముగా నా యనుభవ విషయములను బ్రతిపాదించి యున్నాను. దీనిని జదివినచో విద్యార్థిలోకము గొంతైన దమశీలమును దప్పక సరిదిద్దుకొనగలరని నా యంతరాత్మ ప్రబోధించుచున్నది.

మానవునకు శీలమెంతగా నవసరమైయున్నదో మితభాషణము గూడ యంతే యవసరమైయున్నది. దీనిని బాటించినచో తప్పక సత్యవాక్పరిపాలనము గావించిన వారగుదురనుటలో సందియ మించుకయును లేదు. ఈ సుగుణము నలవరచుకొనిన యెడల "బంగారమునకు దావియబ్బినట్లు"గా మానవుడు సమాజమున రాణింపగలుగును.

పోగా నేకాంతవాసమునుగూడ మానవుడు సాధింపవలెను. దీని వలన పరమాత్ముని ధ్యానము, తత్త్వచింతన మున్నగు సద్గుణముల నలవరచుకొనుట కవకాశము గలదగును.

ఇట్టి సుగుణములతో గ్రథింపఁబడిన యీ చిఱుపొత్తము చాల కాలమునుండి మూలనబడియుండి నేడుగదా! ఆంధ్రప్రదేశ్ సాహిత్య

అకాడమివారి కొంతది యార్థిక సహాయ్యమువలన ముద్రణ రూపమును దాల్చి వెలుగులోకి ప్రవేశించుచున్నది. అందుకు సాహిత్య అకాడమీ పెద్దలకు నా కృతజ్ఞతల నర్పించుచున్నాడను.

ఆర్థించగానే నాలుగమృత వాక్యముల వ్రాసి యీ చిన్ని పుస్తక మునకు మిక్కిలి శోభనుగూర్చిన పెద్దలు శ్రీ డా॥ దివాకర్ల వేంకటావ ధాని ఎం. ఏ, (ఆనర్సు) పి. హెచ్. డి. ఆంధ్ర శాఖాధ్యక్షులు. ఉస్మా నియా యూనివర్శిటి, హైదరాబాదు గారికి శ్రీ వే॥ పం॥ వేంకటేశ్వరశాస్త్రి, విరాట్ పత్రిక సంపాదకులు, యాకుత్పుర హైదరాబాదు గారికిని నా హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను. తప్పులు లేకుండ ముద్రణమునకుదోడ్పడిన శ్రీ మురళీ పవర్ ప్రెస్ మేనేజరుగారికిని నా కృతజ్ఞతలు.

ఈ చిరుపుస్తకమును విలిచి యత్యంతశ్రద్ధతో బఠించి విద్యార్థులు గొంతవరకైన యిందులోని సుగుణము గ్రహించి పాటించినచో నాయీలేఖ సార్థకమని భావించుచున్నాడను.

ఇట్లు

బుధజన విధేయుండు, గ్రంథకర్త.

డా. దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ. (ఆనర్సు) పి. హెచ్. డి.
ఆంధ్రశాఖాధ్యక్షుఁడు, ఉస్మానియా విశ్వవిద్యాలయము.

శ్రీ పండిత రాచవీరదేవరగారు రచించిన రత్నత్రయమను పేరు గల మూఁడు వ్యాసములను జదివి యానందించితిని. శీలము, మితభాషణము, ఏకాంతవాసము అనునవి ఆ వ్యాసమునందలి వస్తువులు మణిమయములు, స్వర్ణమయములునగు నలంకారములు బాహ్యశోభను మాత్రము కలిగించును మరియు నవి అనిత్యములు. అట్లుగాక మానవుల కాంతరశోభ కలిగింప దక్షములై శాశ్వతములై పరఁగు నలంకారములు కొన్ని యున్నవి. వానిలో నగ్రగణ్యము శీలము "శీలం పరం భూషణమ్" "శీలం నరస్య భూషణమ్" "శీలం సర్వత్ర వై ధనమ్" మున్నగు సూక్తులు పుట్టుటకు మానవ జీవితమున శీలమునకుఁగల ప్రాధాన్యమే కారణము విద్యావంతునివలెనే శీలవంతుఁడును సర్వత్ర పూజింపఁబడును విద్యావంతుఁడు తన విద్యావైభవముచే నితరుల బుద్ధిని రంజింపఁజేయును; శీలవంతుఁ డాత్మలనలరించును ఆపదలందు శీలము గీటురాయి. శీలవంతుఁడు తాత్కాలికముగాఁ గొన్ని యాపదలకు గురియైనను దరువాత వానిని దరించి యెల్లరి ప్రశంసలను జూఱగొనును.

శీలము వలెనే మానవునికి మితభాషణము కూడ నొక అమూల్యమైన యలంకారము. నన్నయ్య జనమేజయునికి మితహితసత్యవాక్య ! అను సంబోధనమును వాడియుండెను, యయాతి పూరునికిఁ జెప్పిన నీతులలో మితవాక్యత్వమొకటి మితభాషణ మారోగ్యరక్షణమునకేకాక సత్యపాలనమునకును సాధనమై మానవుల కత్యంత గౌరవము నాపాదింపఁజేయును "కంచు మోగునట్లు కనకంబు మ్రోగునా" అను వేమన సూక్తి యందలి తాత్పర్యము గ్రహింపఁదగినది.

శీలమితభాషణములవలె నేకాంతవాసముకూడ సజ్జనానంద కరమై యొప్పారును. యోగులెప్పుడు నేకాంతవాసమును గాంక్షింతురు. ఏకాంతవాసము మానవునకు వైరాగ్యమును ప్రశాంతిని జేకూర్చును, అది భగవద్ధ్యానమునకుఁ బరమోత్తమ సాధనము.

ఈ మూఁడు రత్నప్రాయములైన గుణములను గూర్చియు శ్రీపం. రాచవీరదేవర గారిందు సరళము, సర్వబోధమునైన శైలిలో ప్రమాణ పురస్సరముగా వివరించియున్నారు. ఈవ్యాసములు నీతిమంతుల నిర్మల జీవితమును గాంక్షించువారి కెల్లరికి నుపాదేయములు, ఇందలి శైలి సులభ సుందరమై యొప్పుచున్నది.

దివాకర్ల వేంకటావధాని

# సార్థకనామధేయ గ్రంథము

సరళ ప్రవర్తనులు, సౌమ్యస్వభావులు విద్వద్వర్యులగు పెద్ద మఠము శ్రీపండిత రాచవీరదేవర 'కావ్యతీర్థ' M O L. గారు రచించిన 'రత్నత్రయము' అను లఘుగ్రంథమును నేను చదువుట తటస్థించినది. రచయిత కావ్యశాస్త్ర వినోదముచే కాలముగడుపు ధీమంతుడగుటయే గాక ఉత్తమోత్తమమగు ఉపాధ్యాయ వృత్తియందున్న వారగుటవలన 'అధ్యయనాధ్యాపనాదులచే కలిగిన అనుభవమును పురస్కరించుకొని ఈపుస్తకమును రచించినారు, కావున పుస్తకము రత్నత్రయములచే రత్నాకరముగ అలరారుచున్నది. అంతియేగాక శాస్త్రవిధిననుసరించి జీవితమును గడుపుచు ధర్మ, అర్థ, కామ, మోక్షములను చతుర్విధ పురుషార్థములను బడయుటకు మానవాళికి మార్గదర్శకముగ నున్నది.

ఆత్మకు ఆధ్యాత్మతత్వము, దేహమునకు భౌతికతత్వము ప్రధానములు కనుక మనుష్యుడు ఆధ్యాత్మ, భౌతికతత్వముల, సమన్వయముతో సంసారయాత్రను సాగించవలయును. ఏలనన మనుష్యుడు కేవలం ఆత్మకాడు. కేవలము శరీరమునుకాడు. శరీరస్థ ఆత్మయే మనుష్యుడు. ఈతథ్యమును గుర్తించక భౌతిక ఆకర్షణలకు లోబడి ఆత్మ విస్మృతులైన జనులకు-ఆబాలవృద్ధులకు అతిసులభముగ అవగాహనమగునట్లు అమోఘముగ రచించబడిన ఈగ్రంథరాజమును పండిత పామరులనక సర్వజనులు స్వాధ్యాయ మొనర్చుటకు తగియున్నది.

ఇట్లు

విరాట్ పత్రిక సంపాదకులు

వేంకటేశ్వరశాస్త్రి



పండిత శ్రీ పెద్ద మఠము రాచవీరదేవర, 'తీర్థ' (కలకత్తా)

M. O. L. ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాదు.

భాషాప్రవీణ. సాహిత్యాలంకార, కన్నడ "జాణ"

# మదీయవంశావళి

(శివశరణ శివశ్రీ బండారు తమ్మయ్యగారిచే బరిష్కృతము)

# దండకము

శ్రీకరంబైన యాంధ్రప్రదేశంబునన్ మధ్య మాణిక్యమున్ బోలి బోనంబుకాధారమైనట్టి జిల్లాకు (మెదక్) తాలూక యందోలునన్ జేవ శాఖ్యాపురంబందునన్ ముఖ్యుడై సన్మఠాధీశ్వరత్వంబుగైకొన్న శ్రీసంగమేశాఖ్య మాహేశ్వరుం డొప్పు నందీశగోత్రోద్భవుండై సదాచారసంపన్న శీలుండు. ధీరుండునౌ నాత డా శ్రీమతిన్ శివ్వమాంబాఖ్య సాధ్వీమణిన్ బెండ్లియాడెన్ మహావైభవోపేతుడై, కొన్నినాళ్ళిట్లు మాహేశ్వరాచారశీలంబులం దొప్పుచున్ దాను సంసారనిర్వహణమున్ జేయగాగల్గిరవ్వారికిన్ బుత్రరత్నంబులా రాచయార్యుండునున్, శంకరార్యుండు, పంచాక్షరాఖ్యుండునున్, శ్రీషడక్షర్యభిఖ్యుండునున్, వీరయార్యుండునానేవురున్ బేర్మి వర్ధిల్లగా నందుఁ బంచాక్షరీనాముడైక్యంబునొందగ శేషించు నా నల్వురన్ జ్యేష్ఠుడౌ రాచయాఖ్యుండు రాణించె నింటన్ వహించెన్ స్వసంసారభారంబు శ్రీశంకరార్యుండు పాపన్నపేటన్ మఠాధీశుడై యుండి రాజిల్లగా స్వామి యా శ్రీషడక్షర్యభిఖ్యుండు దా జోగిపేటన్ స్థితుండై సదాశివ్వపేటన్ మఠాధీశతన్ బూని రాజిల్లె; వైరాగ్యతేజో విశేషంబు మన్నించుచుఁ భక్తబృందంబు పాదార్చనల్ సేయగా శాంతన్ దక్షతన్ బూజ్యతన్ గ్రాలుచున్ దానధర్మాదిసత్కార్యముల్ సల్పు పుణ్యాత్ముడై (గొల్లిశానామమున్ జెందఁగా) కొల్లగా కీర్తులన్ జెందఁగా వీరలన్ జిట్టతమ్ముండు వీరయ్యకున్ జ్యేష్ఠుడౌ పుత్రు రాచయ్యనున్దా స్వపీఠంబునన్ నిల్పె నీరీతి సామాజికశ్రేష్ఠమున్ గోరుచున్ వేడ్కమై లింగపూజాధురీణుండునైయుండఁగా నంత నాశంకరుండున్ సదా మోదకారున్ నిజాధీనమున్ జేర్చి కైలాసవాసున్ దగన్ జేసెఁ దాన్.

సీ. పరమేశుఁ జేరె నా భ్రాతయని తలంచి
వగచి వీరయ తన భ్రాతృపదవి
కై లాతివారు రాజాలరని గణించి
తనదుపుత్రునిగాని నిల్పెను ముదమున
దేశ్ప్రపై నత డిటు లా వీరసుతుగూడి
తనదు శిష్యులమదుల్ తనియ జేసె
బాలుండు ముద్దులొలుకు పలుకులు వినిపింపఁ
వత్సలత నతనిఁ బంపె బడికి

తే.గీ. పిదపఁ దల్లితండ్రి పెద్దకొమరుఁ జూచి
నెనరుతో యతీశ్వరునకొసంగ
నతఁడు స్వీకరించి కుతుకమ్ముతోఁ బెంచి
కారణాలుజరుపఁ జేరె శివుని.

తే.గీ. యతికి సోదరుఁడైన వీరయ్యయంత
అన్న దివికేఁగ బాలుని నాదరించు
వారు లేరని తాఁ దెచ్చి గారవమునఁ
బెంచుచుండెను తా జోగిపేటఁ జేరి.

(కై. వా శివశ్రీమఠము సిద్ధవీరయ్య డాకూరుగారి
కృతిద్వయము)

తే.గీ. శ్రీకరుఁడు వీరశైవాబ్ధిశీతకరుఁడు
ప్రథితగుణుఁడు శ్రీవీరయాహ్వయబుధుండు
తనదుపుత్రురాచయకు విద్యలనునేర్పి
యరిగె కైలాసమునకుఁ దా నంతమందు.

క. శ్రీ వీరయాఖ్య సుగుణికి
వెలిసె పుత్రుండు రాచవీరయకరమున్
కొమిటోడను విద్యల
వెలసె పితృభక్తిగల్గి నెగడెను నెపుడున్.





కై. వా. శ్రీ వీరయ్యగారు.　　కై. వా శ్రీమతి నాగమ్మగారు.

(కృతి సమర్పణము)

నిరంతర శివాచార సంపన్నులు నిరతాన్నదాన దత్పరులునై యఖండకీర్తిని గడించిన కై. వా. మదీయ మాతాపితరులునైన శ్రీమతి నాగమాంబ శ్రీ వీరయార్యుల పాదారవిందంబుల కివె యీపుత్రుని హృదయపూర్వకమైన సుమనాంజలి సమర్పితము

శ్లో॥ మాతా మే నాగమాంబా చ, వీరార్యా చ పితా మమ
తయోః జ్యేష్ఠపుత్రోఽహం, రాచవీరాఖ్య దేవరః
సంస్కృతాంధ్రాంగ్లభాషాసు హిందీ కర్ణాటకేషు చ
"పంచభాషా ప్రవీణోఽహం, రాచవీరాఖ్య దేవరః"



# ప్రార్థన

నమో ఉగ్రస్వరూపాయ, నమో జిష్ణ్వాదిశాత్రవే ।
దక్షయజ్ఞ వినాశాయ, వీరభద్రాయ తే నమః ॥

నమః శివాభ్యాం నవయౌవనాభ్యాం ।
విరించి విశ్వంచసుపూజితాభ్యామ్ ॥
విభూతిపాటీర విలేపనాభ్యామ్ ।
నమోనమః శంకర పార్వతీభ్యామ్ ॥

నమః శివాభ్యాం నవయౌవనాభ్యామ్
పరస్పరాశ్లిష్టవపుర్ధరాభ్యామ్ ।
నగేంద్రకన్యాం వృషకేతనాభ్యామ్
నమోనమః శంకర పార్వతీభ్యామ్ ॥

"ఒక పుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తి రం
జకుడై పెట్టిన పుణ్యమూర్తికి బునర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోపచారముల నిన్నర్చించుచోఁ బెద్దనై
శివుఁడై యుండెడువాఁడు నీవగుట దాపత్రంబె సర్వేశ్వరా !"

"దంతమ్ముల్ పడనప్పుడే, తనువునన్ దార్ఢ్యంబు పోనప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె, జరాక్రాంతంబు కానప్పుడే
వింతల్ మేన జనింపనప్పుడె, కురుల్ వెల్వెల్ల కానప్పుడే
చింతింపన్వలె నీ పదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా !"

# రత్నత్రయము

ప్రతి మానవున కలంకారప్రాయములైనవి 3 రత్నములు.

1. శీలము
2. మితభాషణము
3. ఏకాంతవాసము

**అలంకారములు :**

శ్లో॥ "గుణో భూషయతే రూపం శీలం భూషయతే కులమ్
సిద్ధి ర్భూషయతే విద్యా భోగో భూషయతే ధనమ్॥"

శ్లో॥ "ధీరాణాం భూషణం విద్యా మంత్రిణాం భూషణం నృపః
భూషణం చ పతి స్త్రీ ణాం శీలమ్ సర్వత్ర వై ధనమ్॥"

లోకమున మానవుడై జన్మించినపిదప నాతడెల్లప్పుడు సుఖముగా నుండుటకు, శాంతిమయ జీవితమును గడుపుటకు, పదుగురిలో గౌరవ ప్రపత్తులను బడయుటకు తహతహలాడుచు నిరంతరము త్రికరణ పురస్సరముగా శ్రమించును. కాని వీనినెల్ల నొకేసారి తానసుకొన్నంత సమయములో పొందక ఒక్కొక్కసారి, విసిగివేసారి, ఈ ప్రపంచము నుండి విముఖతచెందుచుండును. అట్లగుటచే మానవుఁడు దన కర్తవ్యము నుండి విచలుడగును. మానవుఁడు స్త్రైవానిని బడయనెంచినచో స్థిరచిత్తముతోనుండి యింద్రియముల స్వేచ్ఛ నరికట్టి దుర్గుణములకు దూరముండి కర్మేంద్రియములకు జనులు మెచ్చుకొనునట్టి బాటలయందు

నడచుట కనుమతి నీయవలయును. అప్పుడే మానవుడు జనులచే గౌరవ ప్రతిష్ఠలను బడయగలుగును.

ప్రపంచ ప్రజలను పాపపంకమునుండి యుద్ధరించుటకై యవతరించు మహాపురుషులందఱు తమతమ నిర్మలమైన చరిత్రను ఇతర సామాన్యజనుల కాదర్శముగా నుండుటకై "కొన్ని ముఖ్యసూత్రములను" ముఖ్యోద్దేశముగా తమ యెదుట వారి నుంచుకొని యదేవిధముగా నాచరించుచుందురు. ఆ సూత్రములే వారి మతము యొక్క ముఖ్య సిద్ధాంతములు, అదేవిధముగా నిక్కము "రత్నత్రయ" మును గూడ నమ్మవలెను. ఈ రత్నత్రయములోని మొదటిదగు "శీలము" ప్రతిమానవునకు ముఖ్యమైనది. ఈ శీలము మానవుని పశుపక్ష్యాదుల నుండి వేరు చేయుచున్నది. అంతేగాదు ఈ శీలమును దృఢముగా పాటించినవాడు సమస్తమానవులలో నున్నతస్థానము నధిష్ఠించుననుటలో నందియ మించుకయును లేదు.

శ్లో: ప్రత్యహం ప్రత్యవేక్షేత నర శ్చరితమానసః
కిం ను మే పశుభిస్తుల్యం కిం ను సత్పురుషైరితి ॥

తా: ప్రతిదినము మనుష్యుడు తన ప్రవర్తనమును పరీక్షించుకొనుచుండవలెను. "నా ప్రవర్తనము పశువుల ప్రవర్తనతో సమానముగా నున్నదా, సత్పురుషుల ప్రవర్తనతో సమానముగానున్నదా" యని.

విజ్ఞానము, సభ్యత మానవుని యందధిగమించియుంటచేతనే మానవుని స్థానము పశుపక్ష్యాదులకంటె ఉన్నతకోటికి జెందియున్నది. మానవుడు తన విజ్ఞానబలముచేతనే మిగత ప్రాణులనన్నింటిని దన యధీనమునందుంచుకొని దానాజ్ఞాపించినట్లవి యొనర్చుచున్నవి. ఏనుగు మున్నగు మహాప్రాణులు గూడ మానవుని బుద్ధికి లొంగితిరుగుచుండును

అదేవిధముగా శీలమును గాపాడుకొనిన మానవుడుగూడ సమస్త జనులను దనయనురాగమునకు వశీభూతులనుగా జేసికొనును

శీలమును శంకించుటకు గొన్ని గారణములను మనము స్థూల ముగా గ్రహించవచ్చును. ఇతరుల యింట్లోకి తాను ఆ యింటి యజ మాని లేనప్పుడు ప్రవేశించుటగాని, లేదా ఆ యజమాని యనుమతిలేకుండ నాతనికి సంబంధించిన స్త్రీలతో యథేచ్ఛగా సంభాషించడము గాని వారితో సరస సల్లాపము లాడడము గాని శీలవంతుని గౌరవమునకు దీరని కళంకము నాపాదింపజేయును. "అనుమానాస్పదము కీడుదెచ్చును" ఇట్లు అగౌరవప్రదముగా మెదలుట విజ్ఞానవంతునకు మరియు శీలవంతున కుచితమైనది గాదు.

ఒకేసారి బరుల గృహములో ప్రవేశించుటకంటె వివేకవంతుడు గృహము వెలుపల నుండి ఆ యింటి యజమానిని గూర్చి విచారించుట మంచిది. ఇంట్లో ప్రవేశించుటచేత మరో ప్రమాదముగూడ గలదు. ప్రవేశించిన వ్యక్తి యెంతటి యింద్రియ నిగ్రహముగల వాడైనను ఆ యింటి స్త్రీల వలన నేదైన ప్రమాదమేర్పడుట కవకాశమున్నది. కావున ప్రవేశించకుండుటయే ఎంతైన శ్రేయోదాయకము.

పరస్త్రీలను జూచి నవ్వడము, ఎగతాళి జేయడము, వారి రూప లావణ్యముల గూర్చి ఇతరులతో చర్చించుట లేదా రేయింబవళ్ళు రూపవతి యొక్క యాకృతిని గూర్చి చింతనజేయుట ఇంద్రియముల వలన మొనర్చుటలేదా ఉద్రేకపరచునట్టి విషయముల జూచుట, చదువుట, తాకుట ఇవన్నియు శీలమును (భంగపరచునట్టివె)గాపాడుకొనయత్నించు వ్యక్తికి సరియైనవి గావు, వీని నుండి యెంతదూరముండిన నంతమేలు.

శ్లో॥ "సుందరం పురుషం దృష్ట్వా భ్రాతరం పితరం సృతం
యోనిర్ద్రవతి నారీణాం సత్యమ్ మే బ్రూహి కేశవ॥"

అని నీతిశాస్త్రములో అర్జునుడు శ్రీకృష్ణుని గూర్చి ప్రశ్నించాడు ఈ యంశము పైవిషయమును ధృవపరచుచున్నది. అంతే గాదు మరోచోట గూడ ఇదే విషయమును గూర్చి "బలవా నింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి" సౌందర్యమనునది యెంత యింద్రియ నిగ్రహము గలవారి నైనను చలింపజేయుచున్నది.

ఇందు కుదాహరణములు :- పురాణాదులలో విశ్వామిత్రుఁడు, చంద్రుడు, దేవేంద్రుడు మొదలగువారి యుదంతముల మనము వినియే యున్నాముగదా !

శ్లో॥ విశ్వామిత్ర పరాశర ప్రభృతయో వాతాంబుపర్ణాశనాః
స్తేఽపి స్త్రీముఖ పంకజం సులలితం దృష్ట్వైవ మోహంగతాః
శాల్యన్నం స ఘృతం పయోదధియుతం యే భుంజతే మానవాః
తేషామింద్రియనిగ్రహోయదిభవేద్వింధ్యస్తరేత్సాగరమ్ ॥
—భర్తృహరి

కఠోరమైన తపంబొనర్చిన యట్టి మునిపుంగవులే అందగత్తెల ముఖకమలము నవలోకించుటచే చలించిన మనస్కులైరి. ఇఁక సన్న బియ్యపుటోగరము నెయ్యి, పాలు, పెఱుగు- వీనిని భుజించిన యట్టి మానవుఁడు ఇంద్రియ సంయమనముజేయుట యంటే వింధ్య పర్వతము సంద్రము పై తెప్పలా తేలిపోవునట్లే సరి, అన్నారు పెద్దలు. అనునపుడు సామాన్యమానవుని గతియేమి ?

శ్లో॥ శీలం శౌర్యమనాలస్యం పాండిత్యం మిత్రసంగ్రహః
అచోరహరణీయాని పంచైతాన్యక్షయో నిధిః ॥

శీలము, శౌర్యము సోమరితనము లేకుండుట, పాండిత్యము, స్నేహితులను సంపాదించుట యీ యైదును దొంగలు హరించలేని తరగని నిధులవంటివి.

శ్లో॥ జితేంద్రియత్వం వినయస్య కారణం
గుణప్రకర్షో వినయాదవాప్యతే
గుణాధికే పుంసి జనోఽనురజ్యతే
జనానురాగః ప్రభవో హి సంపదః ॥

జితేంద్రియత్వము వినయమునకు గారణము. వినయము వలన గుణము లధికమగును. గుణాధికుడైన పురుషునియందు జనులు ప్రేమను

గలిగియుందురు. జనానురాగము సంపదలకు మూలము. అట్లాచరించి నవుడే మానవుఁడు జనులచేత గౌరవ ప్రతిష్ఠలను బడయగలడు.

పూర్వమున మహాపురుషులందఱు నిదేవిధముగా- నాచరించుట వలన వారు సమస్తజనుల గౌరవమన్ననల నందుకొని యమరజీవులైరి. పూజ్యస్థానముల నలంకరించినవారి పలుకులు జనులకు వేదవాక్యములుగా జరిణమించును. వారి మనస్సు వెన్నవలె మృదువై నిర్మలమైనదగుటచే నట్టివారు సమస్త జనుల హృదయ సరోవరములందు రాజహంసమాదిరి సంచరించుచుందురు. వారి యాచరణ పరమపవిత్రమై పరిశుద్ధమైనది యగుటవలన నఖిల లోకముల కాదర్శప్రాయమై విలసిల్లుచున్నది.

సజ్జనులు తమ శరీరమంతయు కనులుగలిగి యేమరుపాటుతో నే పొరపాటు జరుగకుండ యేదూషణకు నెడము నివ్వకుండజేసికొని తమను తాము గాపాడుకొనుటయే "నిజమైన శీల"మనబడును. ఇట్లు తమలో ధృవపడిన శీలము సమస్త ప్రపంచమును వశవఱచుకొని ప్రజలనందఱి నొక్కసారి యయస్కాంత లూగించి తనవైపు వారినెల్ల నయస్కాంతమువలె నాకర్షించి వారెల్లరు తాను జెప్పినది యొనర్చునట్లుగా జేయుదురు.

శీలమును బాటించు వాడికి స్త్రీలతో నవ్వడముగాని, వారితో సంభాషించడముగాని అసలేగిట్టదు. అంతేగాదు తన చూపును స్త్రీల చూపు లందు మేళవించుటకే జంకును. అది యాతనికొక విధమైన భయము. ఏలనన అలా తన చూపును నిల్పిన లోక మేమనుకొనునో యనియు లేదా ఆ స్త్రీయె ఏమని భావించునోయనియు జంకును.

శ్లో॥ బాలసఖత్వ మకారణ హాస్యం
స్త్రీషు వివాద మసజ్జన సేవా!
గర్దభయాన మసంస్కృతవాణీ
షట్సు నరో లఘుతా ముపయాంతి॥

బాలురతో స్నేహము, కారణములేక నవ్వుట, స్త్రీల గురించి వివాదము, దుర్జనులసేవ, గాడిదపై స్వారిజేయుట, సంస్కారము లేని

మాటల నుపయోగించుట, యీ యారింటి వలన నరుఁడు సంఘములో చులకనయగును

నిజమైన శీలమెట్టిదనిన మిసమిసలాడు నిండు జవ్వనముతో నిండియుండిన స్త్రీ నిండు యవ్వనమున నుండి కండరములుదేలి కాంతుల విరజిమ్ము ధళధళ మెరయు మోముగల యువకుని వద్దికి నిర్భయముగా వెళ్ళునట్లుండవలయును. యీతని జేరిన నామానమున కేలాంటి భంగము వాటిల్లదను దృఢ విశ్వాస మామెలో పాతుకుపోవాలి

పురుషుని దృష్టి, మాట నడక, యాచరణ, యీ మూఁడింటి లోను దనయందున్న శక్తి, అక్క చెల్లెండ్రతో నేవిధముగా జంకు, గొంకులు లేకుండ యత్యంతాప్యాయముతో జనువుగా మాట్లాడునో నదేమాదిరి ఇతర స్త్రీ లెవరైన దనకడ కరుదెంచిన వారితో నిరాటంకముగా మాట్లాడునంతటి విశ్వాసమును సంపాదించవలెను. తాను వికారములకు లోనుగాఁక గంభీరముగా నుండవలెను.

స్త్రీలతో పురుషుడు మాట్లాడు సందర్భమున ఆ స్త్రీల యొక్క భర్తలకుగాని, బంధువులకుగాని, చూపరులకుగాని, లేనిపోని యనుమానములు, ఊహాగానములు దోచుట కేమాత్రమవకాశ మీయకూడదు.

పైన వివరించిన మాదిరిగానే స్త్రీయును యువకునియెడ ఈలాగే ప్రవర్తించినచో నామె పరమపతివ్రతయై లోకమున కాదర్శప్రాయురాలు గానగును. పురుషుడు అంతే, ఈ విధముగా నీ యిరువు రాచరించి తమ తమ శీలముల గాపాడుకొనినచో లోకమీ యుభయుల యెదుట తలవంచి వీరి కాలిధూళిని శిరోధార్యమొనర్చుకొనును

ఇట్టి పరమపవిత్రమైనదియు, నిర్మలమైనదియునగు శీలము స్వయం సేవకులకును. పోలీసువారికిని యత్యావశ్యకమైయున్నది. వారి పైననే దేశము యొక్క బాగోగులు, స్త్రీల యొక్క మానావమానములు నాధారపడి యున్నవి. ఇట్టి శీలమును వారు అలవరుచుకొనిననాడె దేశము సౌభాగ్యవంతము కాఁగలదు.

ఇట్లే పూర్వకాలములోని మహాత్ములెల్లరు అనగా శ్రీరామచంద్రుఁడు, హరిశ్చంద్రుడు, బసవేశ్వరుఁడు, గాంధి, బుద్ధుఁడు మొదలగు వాఁ అందరును తమ తమ శీలమును గాపాడుకొనుటచేత నామహాత్ములు మానవ సమాజమున బూజ్య స్థానమునలంకరించి చిరస్మరణీయులై యశఃకాయులై రూపొందియున్నారు. దీనికంతటికిని వారి "శీలమే" ముఖ్య కారణము, ఐతే ఇట్టి శీలము స్త్రీ తన భర్తయందుగాని, భర్త తన స్త్రీయందుగాని అనువర్తించదు ఇది కేవలము తనకు సంబంధించనివారితో దనను తన మానమును సర్వవిధముల రక్షించుకొనుటయే శీలమనఁబడును, ఇట్టి యమూల్యమైన శీలమును గాపాడుకొనుటకయ్యే పూర్వకాలమున వీరవనితలు, రసపుత్ర స్త్రీలెల్లరు యుద్ధమున తమ భర్తలు వీరస్వర్గము నలంకరించిన సంగతి వినఁదముతోడనే వారు చితిలో బ్రవేశించి తమ పతివ్రతా ధర్మమును గాపాడుకొనుచుండిరి తన శీలమునందు దృఢమైన విశ్వాసముండబట్టియే సీత యగ్ని పరీక్షలో నెగ్గగలిగినది.

ఐతే ఈ శీలమునకు మన భారతీయ మహాపురుషులెంతటి మహత్వము నొసగియుండిరో అంతగా పాశ్చాత్య మున్నగు దేశములలోని జనులు బ్రాధాన్యత నొసఁగునట్లు దోచుటలేదు.

కావున నీ పరమపవిత్రమైన శీలము మన భారత దేశీయ పతివ్రతలకే ఒప్పియున్నది. అంతేగాదు శీలము మన భారతీయుల కమూల్యమైన రత్న ఖచితమైన యలంకారము వంటిది. ఇదే విధముగ పురుషుడు గూడ తాను దైవసన్నిధియందు, పెద్దల సమక్షమమున, పచ్చని పందిటిలో నగ్నిసాక్షిగ ఏడడుగులు నడచి, బ్రమాణ పురస్సరముగా పాణిగ్రహణ మొనర్చిన దనధర్మపత్నితోనె దనజీవితాంతము వరకు పవిత్రమైన జీవితమును గడుపుచుండును

ఇవ్విధముగా స్త్రీ పురుషులు లేదా అప్పుడే పెండ్లియైన నూతన దంపతులు తమ తమ శీలమును గాపాడుకొనుటయం దెక్కువ శ్రద్ధ వహించినవారే మానవ సమాజమున నున్నతస్థానమునలంకరించి మిగత జనులెల్లర కాదర్శపథముగలవారై బ్రకాశించుచుందురు ఇట్టి శీలముగల వ్యక్తి నినెదురించి మాట్లాడే బ్రతిభ మరే వ్యక్తికిని యుండదు.

ఇట్టు శీలమును భద్రపఱచుకొనిన వ్యక్తికి లోకమే లొంగి పోవును. కొన్ని దినముల కాతనియందు ఒక యనిర్వచనీయమైన యద్భుత శక్తి నమకూరి జగమునె గడగడ లాడించు సామర్థ్యము గల వాడగును, ఇట్టి శీలవంతురాలు గనుకనే అరుంధతీదేవి యాదర్శపు స్త్రీయై త్రిలోకముల గౌరవమునకు పాత్రురాలైనది.

ఇంకెందరో మహా మహా పతివ్రతామతల్లులై యఖండ కీర్తిని బడసిరి. సావిత్రి, అనసూయ మున్నగు వారు తమ శీలము ప్రభావము చేత ఘటనాఘటన మహత్వంబు లొనర్చి నేటికి నిహమందు కీర్తి శరీరులై వెలుగొందుచున్నారు, అట్టివారు మట్టిని దాకినను బంగారమగును, అగ్ని శమించును, నీరు గడ్డకట్టును, పర్వతములు చలించును, సూర్య చంద్రాదులు వారి యాజ్ఞకు బద్ధులగుదురు. మృత్యువునకు మృత్యుదేవతలై ప్రకాశింతురు. వేయేల సాక్షాత్తుగా ననసూయ దనపతివ్రతా మాహాత్మ్యము చేతనేగదా త్రిమూర్తులను గూడ బసిపాపలొనర్చినది. ఇంతటి మాతృమూర్తుల యావశ్యకత నేడింతేనగలదు

పురుషులు గూడ యదేమాదిరి తమ తమ శీలమును రక్షించు కొనినచో నాతని యెదురించునట్టి ప్రకృతి శక్తు లేవియు లేవని నిశ్శంకముగా, నిరాఘాటముగా జెప్పనొప్పును.

అటులుండుటచేతనే శ్రీ శంకరాచార్యులు, బసవాది ప్రముఖులు, రామానుజ మున్నగు సత్పురుషులెల్లరు లోకవంద్యులై విలసిల్లిరి. అంతే గాదు వారు తమ భౌతికదేహములందు పరమపవిత్రములైన విచారము లుండుచేత పవిత్రసత్కార్యము లనేకములు గావించి సార్థకజన్ము లనిపించుకొని యమరజీవులై శాశ్వతకీర్తిని నిల్పుకొనియున్నారు. జనులు వీరి నామములగాని, ఆచరణములనుగాని, యెప్పుడు, ఎన్నడు మరవకుండ స్మరించి, యాచరించుటకు యత్నింతురుగావుత! ఇందుకు మూలం శీలమె.

# అనుబంధము

## "శీలం పరం భూషణం"

"శీలం పరం భూషణం" జీవితమున ఏ విధమైన దారిద్ర్యమున్నను సరే, శీలమను దారిద్ర్యముండగూడదు. ఒకవేళ ఉండినను దానిని ద్వరలో నిర్మూలించుకొనవలెను. శీలమే శ్రేష్ఠమైన సంపద, ఎల్లప్పుడు అన్నింటిని తనలో నిముడ్చుకొను సంపద, అందరిని సమ్మతింపజేయు సంపద, జీవితము లోపల బయట శుభ్రపఱచునట్టిది. శీలముతో శుద్ధి యభివృద్ధులు గలుగును, ఇహలోకమున నభ్యుదయము, పరమున శ్రేయస్సిద్ధులు సంభవించును.

సమస్త గుణధర్మములకు, సమస్త ఆచార విచారములకు, నిలయమువంటిది శీలము. శీలవంతుడే సకలసౌభాగ్యవంతుడు, సర్వశుద్ధి, సర్వసమృద్ధములకు మూలమైనది శీలము. సమస్తసుఖ కల్యాణములకు మూలము శీలము, నిజమునకు శీలమే శ్రీశైలము, శీలవంతుడే శ్రీశైలనాథుడు. సమస్త మంగళములకు మంగళమువంటిది.

ధనికుని దారిద్ర్యము తొలగునట్లు, శీలవంతుని సర్వపాపములు తొలగును. సర్వపావనములు రూపొందును, శీలమును పీడిన వేరే తపస్సులేదు. శీలము పీడినవేరే తత్త్వము, తేజస్సునులేదు. వండుటకగ్ని, నీరు అత్యవసరము, ఆ విధముగానే ఆత్మదర్శనము గలుగుటకు శీలము సుజ్ఞానములు, శీలముచేత త్రిమలములు నిర్మలములవగలవు. త్రికరణ

శుద్ధికి శీలమే మూలకారణము, కర్మచేత కలుషితమైన జీవనమును శీలము నిర్మలమొనర్చును, త్రివిధతాపతప్తమైన జీవితమును ప్రశాంత పఱచును, ఎంతటినష్టమునైనను భరింపవచ్చును, గాని శీలనష్టము భరింప రానిది. ఎట్టికష్టమునైనను సహింపవచ్చును గాని శీలభ్రష్టతచే వాటిల్లిన కష్టము సహింపరానిది. శీలభ్రష్టులు శతముఖముల నష్టపడుదురు.

శ్లో॥ కో మిత్రం దుర్జనానాం కః ప్రియో వారయోషితామ్ ।
కః ధర్మో భ్రష్టశీలానాం కః శత్రు స్తత్త్వదర్శినాం ॥

తా॥ దుర్జనులకు మిత్రులుండరు, దుష్టశీలముగలయువతికి ప్రియుడుండడు. భ్రష్టశీలునకు ధర్మములేదు. తత్త్వదర్శులకు శత్రువు లుండరని భావము, క్రియాజ్ఞాన శీలమైననే సత్యజీవితము. క్రియ మరియు జ్ఞానములే జీవితముయొక్క సత్యసాధనము సత్యశీలములు ఈ రెండు మానవుని యొక్క బహిరంగ అంతరంగములను శుభ్రపఱ చును. కార్మిక, మాయిక, మలత్రయములను క్రియాజ్ఞానములు నశింప జేయును (తుడిచిపెట్టును). మానవుడెప్పుడు క్రియాశీలుడై యుండవలెను. మరియు జ్ఞానశీలుడై యుండవలెను, ధనమునకు దానమే ఫలము. శ్రోత్రమునకు శ్రవణమే ఫలము, సతికి సుతుని ప్రాప్తియే ఫలము. కాన కృతికి మరియు హృదయమునకును శీలమే ఫలము, ఆచారములేని యంగము శీలములేని యంతరంగము ఈ రెండును రాణించవు.

శ్లో॥ ముఖం ప్రసన్నం విమలాచదృష్టిస్తథానుకంపో మధురాచ వాణీ
స్నేహాధికః సంభ్రమదర్శనంచ సదానుశీలస్యజనస్య లక్షణమ్॥

శీలముతోగూడినవారి ముఖమెల్లప్పుడు కళకళలాడు చుండును. దృష్టి నిర్మలముగానుండును. వారి హృదయము దయార్ద్రమైయొప్పును. వారి వాణి అత్యంత మధురముగా నుండును. హృదయము స్నేహా

పూరితమైనది. అట్టివారి దర్శనమునకై జనులు వేయికండ్లతో వేచియుందురు. శీలవంతుని యొక్క ముఖ్యలక్షణములవి.

శ్లో॥ "విద్యాకామదుహాధేనుః సుశీలం నందనంవనం ।"
తా॥ విద్యయే కామధేనువు శీలమే నందనవనము.

శీలవంతులు తమ శీలమను నందనవనమున కుంజనికుంజములను తమయొక్క భక్తి ఆసక్తియను జలముతో పెంచుదురు. స్వానుభవ సత్వమను నీరిడిపోషింతురు. వనముయొక్క లతావృక్షములు చిగుర్చును. పుష్పించును మరికొన్ని ఫలించును, మందార పుష్పములు వికసించును, అమృతఫలములు పరిపక్వములగును ప్రతి పుష్పమందున విచారమను సువాసన నిండియుండును. ప్రతి ఫలమున స్వానుభవమను రసము నిండియుండును. ప్రతి పత్రమునందు ఆచారమను పచ్చని రంగుండును. ఈ శీలోద్యానమున విహరించు వారి యానంద మింతయని చెప్పుటకు వలను పడదు. వారికి గలుగు పవిత్రత యెనలేనిది.

శీలవంతు డెవరిని ద్వేషింపడు, ఏ విషయమునందాసక్తిని గనపరచడు. దయాహృదయులై యుందురు, అహంకారములను, మమకారములను పెరకివైతురు, సుఖదుఃఖములను సమానముగా జూతురు. ఎల్లప్పు డానందముతో నిండియుందురు. చిత్తైకాగ్రతను మరియు స్థిర చిత్తములను బడసియుందురు. ఎప్పుడూ పరమాత్మునియందు లీనమనస్కులై యుందురు. సచ్ఛీలులై యొప్పుదురు. అట్టివారి స్వభావము శివభావముతో గూడియుండును శీలగుణమే సంపద, లౌకిక ఆడంబరమునకు గాని, లౌకికుల గౌరవ ప్రతిష్ఠలకుగాని, వారెప్పుడులోనుగారు. తన శీలమును సర్వదాగాపాడుటయందే మిక్కిలి శ్రద్ధ చూపుచుండును. శీలమును గూర్చి ముచ్చటించుట, శీలమునుగూర్చి ప్రబోధించుటయే ఆతని జీవితము.

శీలమునాచరించుటవలన శరీరవాసన, శాస్త్రవాసన, లోకవాసనలు దొలగును. ఈ వాసనలు మలినములైనవి, దేహాభిమానమెట్లు శీలమును నశింపజేయునోయట్లే శాస్త్రాభిమానము తనను నష్టపఱచును. తరచు శాస్త్రము యొక్క భ్రమ శస్త్రముగా బరిణమించును. శాస్త్రవలయ మందు జిక్కుకొనినవాడు తిరుగ విడిలించుకొనలేడు. అంతేగాకుండ శాస్త్రజ్ఞానము శీలమునందు రామిచే అది మలినమై బంధనకారి యగును. మలిన వాసనలనుద్యజించుటయే శీలముయొక్క ముఖ్య ధ్యేయము వీనిని సన్యసించనిదే కాయము, మనసులు శుద్ధములు కాజాలవు.

శీలవంతునకు వాసనాక్షయ మెంతయవసరమో సంశయక్షయ మంతే యవసరము. ఆ కారణమున ప్రమాణ (శాస్త్ర) ప్రమేయ (జీవుడు) సంశయములను శీలవంతుడైనవాడు నివారించుకొనవలెను. విపరీతబుద్ధి రూపకల్పనను వదలుట ఒక బౌద్ధిక శీలమనబడును. దేహవాసనను విసర్జించుటచేత జనన మరణముల భీతిదొలగును. "మరణమే మహా నవమి"యను మంగళ ప్రదమగు శీలభావము అలవడును. బహుశాస్త్రవాసన చేత బుద్ధిభ్రంశమగును, భ్రాంతిజెందును, సంశయభావము మెండగునే కాని నిశ్చయభావమేర్పడదు, మీదుమిక్కిలి స్వానుభవము సంభవింపదు. ఇది గలుగవలెననినచో శాస్త్రవాసనను వీడి శీలవాసనను స్వీకరింప దగును.

లోకవాసన సర్పమువంటిది, సర్పము కాటువేసినచో శరీరమం తయు విషము వ్యాపించునట్లే లోకరంజనమునకు లోనైనచో దనయం తఃకోశము యొక్క ఆత్మ సుఖమునకు వంచితుడు కావలసివచ్చును. లోకమును మెప్పించుటకై యత్నించుట యొక పిచ్చి, అది యెవరికిని సాధ్యముగాని సాధన, కావుననే శీలవంతునకు లోకసన్మానమనవస రము, దీనికైయత యెన్నడును నోటనీరూరలేదు. లోక ప్రవాహమునకు

దెలిపోవువాడు సౌశీల్యమునుండి బహుదూరమున నున్నవాడగును, లోక ప్రీతికై చేయరాని పనులజేయును. మనసొప్పని పనులుగూడ చేయుటకై వెనుదీయడు, జనమెప్పనకై యాచరించువాడు మనస్సు మెప్పునకై యాచరింపడనునది యనుభవసిద్ధము

శ్లో॥ అకుర్వన్నిహితంకర్మ, నిందితంచ సమాచరన్ ।
ప్రసజ్జనింద్రియార్థేషు నరఃపతన మృచ్ఛతి ॥

పై శ్లోకము ఈ నీతినే సమర్థించుచున్నది. లోకవాసనేపతన హేతువైనది, స్వశీలమును నశింపజేయును. చేయదగిన పనిని చేయకుండ మనస్సును మార్చివేయును. నిందితకర్మమునందు నిరతునిగా జేయునని లోకవాసన, ఆకారణముచేత శీలవంతుడైనంత మట్టుకు లోక సంసర్గము నుండి దూరముగా నుండవలెను.

శ్లో॥ సంగంత్యజేత మిధున వ్రతీనాంముముక్షుః సర్వాత్మనా ।
విసృజేద్బహిరింద్రియాణి ఏకశ్చరన్ రహసిచిత్తమనంత ॥
ఈశేయుంజీతతద్వ్రతిషు సాధుచేత్ప్రసంగః ।
ఆత్మవాన్‌క్షమీవివక్త, ఆశీనశ్చింతయేన్ మామతంద్రితః ॥

అని భాగవతమున గలదు, జాగతిక మోహము జాగృతికొరక గొడ్డలి పెట్టువంటిది. ఆత్మప్రగతికి ఆత్మశీలమునకు ప్రతిబంధకము వంటిది. మలినవాసన స్వార్థముతో గూడియున్నప్పుడు మాత్రమది చెడుగు వంటిది, సాధకుడై స్వప్రగతిని సాధించునప్పుడు చెడుగు, అట్లే లోకవంద్యుడు గావలెనను, గోరికను వీడి సిద్ధుడై లోకకల్యాణమునకు శుద్ధమనస్సుతో గృషియొనర్చినచో సుశీలు డనిపించుకొనును.

ఇఁక మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష, ఇవి శుద్ధమైన వాసనలని పతంజలియుద్బోధించియున్నాడు. అందఱియెడ మైత్రీభావము, దీనుల యెడ కరుణాభావము, పుణ్యవంతుల దర్శించిన ప్రసన్నభావము. పాపులను- దుష్టులను జూచి యుదాసీన భావమును వహించుట శుద్ధమైన శీల మనియు. దీనివలన చిత్తము ప్రసన్నతనందుననియు, రాగ. ద్వేషాదులు మద- మాత్సర్యాదులు దొలగుననియు పతంజలి ప్రతిపాదించియున్నాడు.

శ్లో. వేదః స్మృతిః సదాచారః స్వస్యచప్రియమాత్మనః !
ఏ తచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్ !

(మనుస్మృతి)

వేదము, స్మృతి. సదాచారము, తనయాత్మకు ప్రియమైనది.- ఇవి నాలుగు సాక్షాత్తుగ ధర్మ లక్షణములు, మనువుయొక్క ఈ వాక్యమును సూక్ష్మముగా విచారించినచో, వేదము, స్మృతులు. ఈ రెండును ధర్మమునకు ప్రమాణములగుచున్నవి. సదాచారము. స్వాత్మప్రియత్వము ఈ రెండును ధర్మ లక్షణములనిపించును. ధర్మలక్షణములలో సదాచారమే మొదటి శ్రేణికి జెందినదగును.

మానవుడు దర్శించుటకు శుభమైన దుస్తులెట్లవసరమో అట్లే మహదేవునకు తను, మన, భావములు శుభ్రముగా నుండవలెను. త్రికరణములు పవిత్రీకరణమే శీలము, ఇట్టి దాను ప్రతిదిన మాచరించవలెను.

శ్లో ప్రత్యహం ప్రత్యవేక్షేత నరశ్చరిత మాత్మనః!
కింనుమేపశుభిస్తుల్యం కింను సత్పురుషైరితి॥
పఠతో నాస్తి మూర్ఖత్వం జపతో నాస్తి పాతకం।
మౌనేన కలహో నాస్తి న భయం నాస్తి జాగ్రతః॥

పై శ్లోకములోని వచనములు మననముజేసికోవలెను శీలసాధ
కుడు అత్యంత అమూల్యమైన మానవ జీవితమును అమూల్యముగా మార్చుకొనవలెననినచో ప్రతి నిత్యము దిన చరిత్రమును పరిశీలించుకొన వలెను. పశుపథమున కాకర్షింపబడక సత్పథమును వీడక జీవించునట్లుండ వలెను, జాగృతికంటె జాణతనములేదు. కావున జాగృతుడై సచ్చరిత్రము గలవాడే శీలవంతుడగును, జీవితమున ననేక సంఘటనలు దటస్థించును. ప్రతికూల ఘటనములందును మానవుడు తన సత్యనిష్ఠను కాపాడు కొనునదే స్వచ్ఛమైన శీలము.



ఉపాధ్యాయ పండితపరిషత్తు కార్యవర్గ సభ్యులు



కూర్చున్నవారిలో ఎడమనుండి మూడవవారు
పెద్దమఠం రాచవీరదేవర ప్రధానకార్యదర్శిగారు



హైదరాబాదు మరియు సికింద్రాబాదు జంటనగరముల ఉపాధ్యాయ
పండితపరిషత్తు కార్యదర్శిగానుండి వార్షికోత్సవ సందర్భమున
తీయబడిన చిత్రము. తేది 25 1.1970.

## మితభాషణము

శ్లో॥ జితేంద్రియత్వం వినయస్య కారణం
గుణప్రకర్షో వినయాదవాప్యతే
గుణాధికే పుంసి జనోఽనురజ్యతే
జనానురాగః ప్రభవో హి సంపదః.

తా : జితేంద్రియము వినయమునకు కారణము, వినయమువలన గుణము లధికమగును. గుణాధికుడైన పురుషునియందు జనులు ప్రేమను గలిగియుందురు జనానురాగము సంపదలకు కారణము.

శ్లో॥ అసంశయం మహాబాహో! మనోదుర్నిగ్రహం చలమ్
అభ్యాసేనతు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే.

తా : మనస్సు నిగ్రహించుట కసాధ్యమైనదియు,చంచల స్వభావము గలదియు ననుటలో సందియములేదు. కాని అభ్యాసముచేతను, వైరాగ్యముచేతను నరికట్టబడుచున్నది,

శ్లో॥ మనః ప్రసాదః సౌమ్యత్వం మౌన మాత్మవినిగ్రహః
భావసంశుద్ధిరిత్యేత త్తపో మానసముచ్యతే.

తా : మనస్సును స్వచ్ఛముగా నుంచుటయు, సౌమ్యముగా నుండుటయు, మాట్లాడకుండుటయు, ఆత్మనిగ్రహమును, తలంపునందు శుద్ధముగా నుండుటయు, మనస్సు చేయదగిన తపస్సులని చెప్పబడుచున్నవి.

ప్రాచీనకాలమున ఋషులు, మునీశ్వరు లందఱు ఈ మితభాషణామునకు కట్టుబడియుండి మిగత హెచ్చుసమయమును పరమాత్మని ధ్యానించుటయందు, పరప్రయోజనకరములగు కార్యములందును వినియోగించుచుండిరి. సాహిత్యగ్రంథరచనా రూపకముగనో లేదా ప్రవ

చనోపన్యాసముల మూలముననో స్వానుభవవిజ్ఞాన బీజములను సామాన్య జనుల హృదయక్షేత్రములందు నాటి వారికి సంసారమాయాపాశములచేత కలిగిన యనేక కష్టనిష్ఠురములనుండి దప్పించుకొనుట కొరకు జక్కనైన బాటను జూపుచుందురు. ఇది వారి సహజప్రకృతి.

మితభాషణ మనగా కాళిదాసు తన రఘువంశములో ప్రథమ సర్గలో జెప్పినట్లు "సత్యాయ మితభాషిణామ్" సత్యమును బాటించుటకై నితరులతోడ మితముగా మాట్లాడవలెనని యర్థము. దీనివలన పెక్కు లాభములుగలవు. విలువైన సమయమును పొదుపుజేసికొనగలము. ఎవరితోడను వాదవివాదము లేర్పడవు దుష్టగుణములనుండియు, దుష్టజనుల నుండియు దూరముండ గలుగుదుము. అంతేగాకుండ మితభాషణమున సత్యము యొక్క విలువయిం దెక్కుడుగా ఇమిడియున్నది. మితభాషిని ప్రజలెంతగానో విశ్వసింతురో అంతగా వాచాలురను విశ్వసించరు. రాను రాను ఆ వాచాలురగల వారెల్ల రసత్యము క్రిందకి మారి సంఘములో నిట్టివారికెట్టి విలువగాని, గౌరవస్థానము గాని యుండదు. జనులదృష్టిలో తేలికగానగుపడుచు రౌడిక్రిందికి దిగజారడంవలన యితరు లెవరును తమతమ యిండ్లలోని కితని రానివ్వరు. ఆర్థికముగను, శారీరకముగను, మరియు వాచికముగ నేవిధముగను సహాయపడరు.

ఇక్కడ ప్రజాదరణకు పాత్రులగుటలోను, అట్లు పాత్రుడు గాక పోవడములోను చాలా వ్యత్యాసము గలదు. సూక్ష్మాతిసూక్ష్మముగా మనము విచారించినచో నది స్పష్టమౌచున్నది.

ప్రజాదరణకు పాత్రుడైనవ్యక్తి సర్వవిధముల సహాయములబడయుచు మెలకువతో నణకువతోను మెదలడముతో పరిసరవాతావరణమును దనకనుకూలపరచుకొని మానవసమాజములో నున్నతస్థానము నధిరోహించును తద్విరుద్ధవ్యక్తి సర్వవిఫలము నధోగతిపాలగును

ఒకడు మిక్కిలి దరిద్రుడై యాపూట కన్నము లేనివాడైనను వాని మితభాషిత్వము, ఆడినమాట దప్పకుండుటచేత నా వ్యక్తి గ్రామస్థు

లెల్లర గౌరవమునకు,విశ్వాసమునకును పాత్రుడగును. అం గాము. ఆగ్రామములోని పెద్దధనికుడుగూడా ఒకొక్క సమయమున తాను ఇతరులకు ఋణమిచ్చునప్పుడు ఈ మితభాషియగు వ్యక్తియొక్క పూచీకత్తుమీద ఋణమిచ్చుట కాతడంగీకరించును. ఈ వ్యక్తి ధనవంతుడనియూకాదు, అతని మితభాషిత్వమే యంతటి విలువగలదైయున్నది. కావున నీతని వాక్యమొక్కటియే యా ధనవంతునకు వందప్రామిసరీ నోట్లు వ్రాసియిచ్చిన విలువగా నుండును. ఇట్టి వెన్నియో నిదర్శనములీ కాలమునను గ్రామీణులయందు గలవు.

ఇట్టి ప్రభావ పూరితమైన మితభాషణముతో నొక విధమైన వింత శక్తి యిమిడియున్నది. అతడు నుడివిన వాక్యములే వేదవాక్యములుగా మారి జనుల అయాయామనోరథములను దీర్చుటయందు సామర్థ్యము గలవై యొప్పుచుండును. మహాతపోధనులెల్లరును ఇట్లే మితవచనములు గల వారయ్యో లేదా పూర్తిగా మౌనమును వహించినవారయ్యో కొన్నాళ్ళట్లుండి వాక్ సిద్ధిని బడయుచుండిరి.

ఇదే విధముగ దశవిధ యింద్రియములలో నేదేనియొక్క యింద్రియమును యెక్కుడుగా నుపయోగించనిచో నది యధికశక్తిని గూడబెట్టుకొనును. ఇట్లే కన్నులు మూయుటయందును నొకలాభముకలదు.

ప్రాచీనకాలమున మునులందరు కన్నులుమూసి తపస్సొనర్చుచుండెడివారు. అట్టివారు కోపమున ఒకేసారి దమ కన్నులుదెరచి చూచినచో నెదురుగా నుండు వస్తువులన్నియు దగ్ధమగుచుండెడివి. లేదా ఒకేసారి దెరచి కరుణతో జూచిన యెడల వ్యక్తి యుద్ధరింపబడుచుండెడివాడు ఉదా: గాంధారి దుర్యోధనుని దనకండ్ల కట్టును విప్పిచూచినతోడనే నాతనికి వజ్రకాయ మేర్పడినది గదా! ఈలాంటి సంఘటన లెన్నింటినో మనము పురాణాదులలో జూచియున్నారము.

కావున మానవు డధికముగా మితముగా మాట్లాడ నేర్చుకొనవలయును, ఎంత తగ్గించిన అంత మంచిది. ఎక్కువగా మాట్లాడుటచేత,

కలహము లేర్పడుటగాని, లేదా యితరులకు విసువుగలిగించుట యందు గాని కారణమగును.

మితభాషి జనులందరి ప్రేమను చూరగొనుటచేత యతనిని మిక్కిలి జనులు గౌరవింతురు. ప్రతివారును తమతమ యిండ్లలోనికి యే యంకుగొంకులు లేకుండ ప్రవేశించుట కనుమతి నీయుదురు. అంతేగాదు అట్టివారు తమయిండ్లకు వచ్చి మాట్లాడుటయే మహాశుభోదయముగాను యెంచి వారితో కుతూహలము మెండుగాగ మాట్లాడుట కాతురతపడుదురు. ధన, కనక, వనిత, ధాన్యాదుల రక్షణయం దిట్టివారిని కన్నుల కద్దుకొని నియోగింపుకొందురు. వారి యాదేశములను 'తుచ' దప్పకుండ యనుష్ఠింతురు.

అందులకే కవికులగురువగు కాళిదాసు "సత్యాయ మితభాషిణాం" అని రఘువంశ మహాకావ్యమునం దుట్టంకించియున్నాడు. గొప్పవారికి మితభాషణమే ఒక యమూల్యమైన యలంకారము. ధనమువంటిది, అనేక సంవత్సరములు తపంబొనర్చి యార్జించిన సత్యవ్రతమును ఈ సూత్రమును పాటించుటతో సులభముగా తనంతటదే సత్యవాక్కునిగా మార్చును.

అల్పభాషి యెన్నడును అసత్యమును బలుకుట కిచ్ఛగింపడు. అట్టిమాటలకు జవియొగ్గడు, సత్యమునే వరించి తమ నిత్యజీవితమును నిర్మలముగా జేసికొనును. వీరి మాట లమృతప్రాయములై దుర్బలులను సబలులుగాను, చైతన్యయుక్తులుగాను, మరియు తేజోయుక్తులుగాను జేయును

క్షణక్షణము ప్రమత్తతతో మెదలి ప్రపంచమున కాదర్శప్రాయులై ప్రకాశింతురు. మితభాషి యెల్లప్పుడు పరస్త్రీల యెదుట దనయింద్రియములకెల్ల బుద్ధి గఱపుకొని యెంతో నిగ్రహముతో యుంటచే వారితో ముఖాముఖిగా మాట్లాడుటకు వెఱచును. యద్యపి మాట్లాడినను యితరుల కేలాంటి యనుమానమునకు జోటివ్వకుండ వర్తింతురు. కాదుకాదు మితభాషిత్వమే వారి నిట్లావరింపజేయును.

మితభాషియగు వ్యక్తియం దొకవిధమైన గాంభీర్యత్వమేర్పడి యెదుటివారికి కాఱడవిలో మదించిన స్వేచ్ఛాగాదిరుగు ఏనుఁగును గాంచిన నితరప్రాణులు భయపడు మాదిరి సమస్తజనులు భయపడుదురు. నిర్హేతుకముగా నీ మితభాషిని మాట్లాడించిన, చెనకిన, ఎగతాళి జేసిన, నేమి కీడుమూఁడునోయను భావన వారిలో తలెత్తుతుంది యద్యపి యంతశక్తి నాతనిలో లేనప్పటికిని మితభాషిత్వ మలా మార్చేస్తుంది. ఈ గాంభీర్యము నీటిలోతు నెఱుఁగనివాఁడు సముద్రమును జూచినతోడనే యందు ప్రవేశించుటకెట్లు భయపడునో ఆట్లే వెనుకంజవేయును, ఆతనితో నెక్కువగా మాట్లాడుటకు ధైర్యముజాలదు. ఇందెంతమాత్ర మతిశయోక్తి లేదు.

అంతేగాకుండ లోకమున ఈ మితభాషి యొక మహాపురుషుడుగా బరిణమించి రానురాను ప్రజలచేత బూజింపఁబడును. అందులకే కన్నడ భాషలో సర్వమునెఱిగిన సర్వజ్ఞ శివయోగి తేలికభాషలో తన యనుభవమును గూర్చి యిట్లు నిరూపించి యున్నాడు. "కచ్చె, కై, బాయి, తన యిచ్ఛయల్లిద్దరే అచ్యుత నప్పం అజనప్పఁ లోక దోళ్నిశ్చింతనప్ప సర్వజ్ఞ" అని.

అనగా కచ్చెయన ధోవతి (గుహ్యేంద్రియ నిగ్రహము) కై చేతితో నితరుల వస్తువుల దొంగలింపకపోవడము. బాయి-వాయి, నోటినుండి యనత్యము నుచ్చరింపకుండుట, బలవంతముగా నసమర్థుల పీడిపకుండుట. వాగింద్రియమును దనయధీనమునందుంచుకొని యితరుల మనస్సునకు గష్టము గలిగింపకుండుట. మొత్తముపై నీ యింద్రియములు (గుహ్యము, చేయి, నోరు,) తన యధీనముచుంచుకొని ప్రపంచమున మెలగినచో నాతడే సాక్షాత్తుగా మహావిష్ణుస్వరూపుఁడు, బ్రహ్మయు, లోకమున నిశ్చింతుడగునని జెప్పియున్నాడు.

కాని మనమీయింద్రియములను మన యధీనమునందుంచుకొనుటయే కష్టతమము. అందుచేతనే, మనమెల్లరము మానవసమాజముతో నున్నత శిఖరాన్నధిరోహింపలేక జారిజారి క్రిందికి బడుచున్నారము

కారణములేకుండ నధికముగా మాట్లాడు వానియొక్క సహజ గుణములన్నియు ఎదుటివారు త్వరలోనె గ్రహించి సమయానుసారముగ నావాదాలునికి యధిక యిడుములదెచ్చియుంచుటగాని, లేదా సమయమునుబట్టి స్వార్థపరులు దమపనిలో నుపయోగించు కొనుటగాని జరుగుట సులభమైన మార్గము వంటిదగును.

మితభాషికి క్రమేణ వాక్సిద్ధి యేర్పడి యత డుచ్చరించు ప్రతి వాక్యములోను ఒకవిధమైన యద్భుత శక్తియేర్పడి యాతని మాటలకు క్రియాకేకత్వముపదిరి అల్పభాషియుచ్చరించు పలుకులెల్ల సత్యముగ జరుగిపోతీకును. అతని మాటకు దిరుగులేదు. అట్టియాతని యద్భుత శక్తిని సామాన్య మానవులెవరును ఎదురించలేరు.

ఆ కారణముచేతనే మితభాషియు నెవ్వరితోడను ఎట్టిసమయము నందును ఎక్కువ మాట్లాడ కుండుటలో గల రహస్యము ఉ:- మనయుగపు మహాపురుషుడగు మహాత్మా గాంధియే నిదర్శము. ఆట్టిహారి వచనములకు అమూల్య రత్నములకుండు వెల యుంటుంది.

కాబట్టి ప్రతిమానవుఁడు మితముగా మాట్లాడుటకు నేర్చుకొనవలయును. ఆ మితవాక్కులోనే యమితమైన పివులార్థ మిమిడియుండవలెను. తాను మాట్లాడునపుడు ప్రతిమాటను సత్యపరిశోధితమై, పరమ పవిత్రమైయుండి తూచితూచి. వెనుకముందులు సుదీర్ఘముగా నాలోచించి యితరులతో మాట్లాడవలసి యుండును, ఇట్టిమాటలకు దిరుగుబాటుండదు.

## మితాభాషియొక్క పలుకులు

"అణిముత్యములవలె మిసమిసలాడు కాంతుపినుచున్నవై, పుష్పములవలె మృదువులై, తేనెవంటి మాధుర్యములుగలవై అమృతము వలె చైతన్యము నొసగునట్టివై, నితరులపై ప్రభావము జూపును."

అంతేగాదు శత్రుజనులకు వారిపలుకులు పదునురేదినమఃలుకులై వజ్రమువంటి పరుసదనముగఁ వై వారి పొగరు నణచివేయును.

అందులకేగదా మహాపురుషుః :

"వజ్రాదపికఠోరాణి, మృదూని కుసుమాదపి" అని నుడివి యున్నారు. ఇది ముమ్మాటికి నిజము.

ఈ మితభాషణమే సత్యమను రూపాంతర వాక్యమును బురస్కరించుకొని శ్రీహరిశ్చంద్రుఁడు సత్యమునకు బాటుపడుటచేతనే తాను భార్యా పుత్రులను,రాజ్యమును విడిచి చివరికి దనను గూడ వీరబాహువునకు విక్రయించుకొని యనేక కష్టముల ననుభవించియున్నాడు. తనమాటను నిలబెట్టుకొనుటచేతనే ఈవరకు జిరస్మరణీయుడై యీతరము వారికిని యాదర్శపురుషుడై చరిత్ర నిలువుకొనియున్నాడు ఈ మహానుభావుని నాటకప్రదర్శనకు బరవశుడైన శ్రీజాతిపిత మహాత్మాగాంధిగారు అక్షరాల పాటించి చివరికి స్వరాజ్యమునే మనకు సాధించిపెట్టినాడు ఈ సత్య వాక్కుతోనె సాయుధులైన పాశ్చాత్యులను గనివిని యెఱుఁగని రీతిగా యుద్ధరంగమున జయించియున్నాఁడు.

ఇట్లే ధర్మరాజాదులుగూడ సత్యమునే బాటించి దమరాజ్యములను మరియుగశత్రాదుల గోల్పోయిరిగదా ! దశరథ మహారాజు తన ప్రియాతిప్రియమైన పుత్రుని యరణ్యమునకు బంపుటకు సిద్ధపడెను. శ్రీరామచంద్రుఁడును దనతండ్రి వాక్యమును సార్థకపఱచుటకై యౌవ నముననే నారచీరల ధరించి సతీ సీతా సమేతముగా రాజ్యమును వీడి యరణ్యముజేరి యట అనేక కష్టముల ననుభవించెను.

కావున మితభాషికి దొలుదొలుత నమితమైన కష్టములు దటస్థించి నను [illegible]కి యవి యన్నియు యీ యిడుములనే[illegible]షముపై దనదృఢ మైన [illegible] లనెడు రాపిడిచే దనజీవితమునే దీర్చి దిద్దుకొని మణి వలె దేదీప్యమానమైన చరిత్రగలవాడై ప్రకాశించును కావున ప్రతిమానవు నకి మితభాషిత్వ మెంతేని యవసరము.

## ఏకాంతవాసము

ప్రపంచమున ప్రతిమానవుఁడు స్వేచ్ఛా వాయువుల బీల్చుచు తమ మనుగడనంయుతము సుఖమయముగా సాగించుటకై ఎల్లప్పుడు యత్నించుచుండును అంతేగాదు తాను పరులతో కలసిమెలసి తిరుగుటకుగాన, ఉండుటకుగాని కృషిసల్పుచుండును. తల్లి గర్భమునుండి దానొక్కఁడే జన్మించి యున్నప్పటికి పెరగిపెద్దవాడైన పిదప యత డొకయందగత్తెను పెండ్లాడి యామె యనురాగఫలితముగా ముద్దుబిడ్డలను గని వారలకు విద్యాబుద్ధులు గఱపియుక్తవయసునకు రాగానే క్రమేణ వివాహము లొనర్చి పెద్దకుటుంబీకుడుగా మారిపోవుట సహజము.

ఇట్లు మానవుడేగాక మాట్లాడని జీవజంతువులుగూడ నీ విధముగానే యుండును. చీమ మొదలుకొని యేనుఁగు పర్యంతము కికారణ్యములలో గుంపుగుంపులుగా కూడి చరించుట మనము జూచియేయుందుము. ఇందులో కొలదిప్రాణులు మాత్రమే ఒంటరిగా నుండవచ్చును.

కాని మోక్షగామియైనవాఁడు పై మార్గమునకు వ్యతిరేకముగా వర్తించును. ఏలన నాతఁడు సత్పురుషుల సాంగత్యమున నుండి వారిని సేవించి వారివలన దివ్యజ్ఞానము నార్జించుకొని "యద్దృష్టంతన్నష్టం" యను సూక్తిమేరకు ప్రపంచమున మనగన్నుల కేదియగుపడునో యది యొకప్పుడు తప్పకుండ నశించునదే యని దెలసికొని "జగన్మిథ్య బ్రహ్మ సత్యమను" వేదాంతవాక్యమును మననముజేసి సంసారమను పంకమును ప్రక్షాళనం బొనర్చుకొనునుద్దేశముగలవాడై లోకమునుండి దూరస్థుడై యెక్కడోనేయరణ్యమునన్నో, నే నదీతీరముననో, లేదా ఏ యొక కొండగుహయందునో అథవా పర్ణకుటీరము నేర్పఱచుకొని రేయింబవళ్ళు పరమాత్మని దివ్యనామసంస్మరణము జేయుచు సమస్తమానవకోటికి నాదర్శప్రాయమైన యాచరణగలవాడై యేకాంతవాసియై ప్రశాంతమైన మరియు నిర్మలమైన సత్యజీవితమును గడుపుచుండును.

ఇట్టి విరాగికి నీ ప్రపంచమున నెవరి దెలాంటివి భయము ఉండదు ఇతఁడు నిర్భయుఁడు.

శ్లో॥ భోగేరోగభయం కులేచ్యుతిభయం విత్తేనృపాలాద్భయమ్
మానేదైన్యభయంబలేరిపుభయం రూపేజరాయాభయమ్
శాస్త్రేవాదిభయం గుణేఖలభయం కాయేకృతాంతాద్భయమ్
సర్వంవస్తుభయాన్వితంభువినృణాం వైరాగ్యమేవాఽభయమ్

ఇతనిని చూచి జగముకంపించును. పరమయోగియై పాప కూపమునబడి మూలుగుచున్నవారిని పైకి లేవనెత్తి వారికి దివ్యజ్ఞానమును బోధించి భవపాశములనుండి విడిపించి సన్మార్గమున ప్రవేశింపఁ జేయును.

ఈ మహాత్ములు లోకమున నుద్భవించునప్పు డొకదే యుండి, మరణించు సమయమున నొక్కడే యను రహస్యమునుగుర్తించి యదియే శాశ్వతమని ఎంచి నదీ ప్రవాహవేగమున గొట్టుకొని వచ్చిన రెండుకఱ్ఱల మాదిరి క్షణకాలము కూడుకొని తరువాత నేగుండుకో లేదా గట్టుకోవాకి నంతమాత్రమున యవి విడిపోయి దేనిమార్గమున నది వేర్వేరుగా పోవు నట్లు నీ ప్రపంచపు గతిని గుర్తించి యుందురు.

శ్లో॥ సాయం సాయం వాసవృక్షం సమేతాః
ప్రాతః ప్రాతస్తేన తేన ప్రయాంతి,
త్యక్త్వాఽన్యోన్యం తంచ వృక్షం విహంగా
యద్వత్తద్వద్ జ్ఞాతయోఽజ్ఞాతయశ్చ॥ శివగీత-3. అ॥

తా॥ పక్షులు ప్రతిసాయంకాలమునను నివాసవృక్షమున గలిసియు ప్రతి యుదయమునను చెట్టునువీడి వానివాని మార్గము ననుసరించుకొను నట్లే జ్ఞాతులు నజ్ఞాతులును స్వకర్మముచే దన్ను పీడిపోవుదురు.

అల్పజ్ఞులమగు మనమెల్లరము మిథ్యమునే సత్యముగా (రజ్జుసర్ప భ్రాంతి లేదా రజతము శుక్తిభ్రాంతి) భావించి స్త్రీమాయలోబడి సాకెవడుచు

మాదిరి వలనుబన్ని యందులో జిక్కి మరణించునట్లు మనమెల్లరము పుత్ర, మిత్ర, కళత్రాదుల వ్యామోహపునురులలో జిక్కుకొనిన వారమై ప్రాణి వెళ్ళునమయమున కాలు సేతులు గొట్టుకొను శక్తి జాలనివారమై గొప్ప వ్యసనమునకు లోనై నతికష్టముగా నసువుల బాయుదుము.

శ్లో॥ అయః పాశేన కాలేన-స్నేహపాశేనబంధుభిః!
అత్మానం కృష్యమాణంత మీక్షతే పరితస్తథా॥ శివగీత. ౯. 60.

శ్లో॥ కింకరోమి? క్వగచ్ఛామి? కింగృహ్ణామి? త్యజామి కిమ్ ?
ఇతికర్తవ్యతామూఢః కృచ్ఛ్రాద్దేహాత్త్యజత్యసూన్॥ శివగీత, ౯. అ 63.

ఇట్టి దుఃఖ సముదాయమును గుర్తింపయేగాబోలు దివ్యజ్ఞానులైన మునులెల్లరు తాము సంసారమున నన్నప్పటికిని గుమ్మరిపురువు మల్లె అది బురదలోనున్నను ఆ బురద నంటించుకొనకుండునటుల లోకమున జరించి చివరికి యీశ్వరుని నామస్మరణమున సంతోషముతో ప్రాణముల బాయుదురు.

ఆ కారణము చేతనే మన పూర్వజులెల్లరు మానవుడీ భవసాగరమును సుఖముగా తరించుటకై నాలుగు మార్గముల గనిపెట్టి వాటి నాచరింపవలసినదిగా బోధించిరి, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాస, ఈనాల్గు ఆశ్రమముల గ్రమముగా బాటించిన ప్రతిమానవుడనాయాసముగా జీవన్ముక్తు డవగలడని జాటిచెప్పిరి.

ఇదొకందులకు సరియైనమార్గమే ఏలనన - రాగిగానివాడు విరాగిగాడనియు లేదా కామిగానివాడు మోక్షగామి గాడని యొకనానుడి యేర్పడినది, ఐతే ఇట్టి సన్యాసత్వముగాని లేదా యేకాంతవాసముగాని

క్రమేణ యభ్యాసమువలన మానవున-కలవడునేగాని యొకేసారి యల వరచుకొనుట కష్టసాధ్యము.

కావున నిట్టియేకాంతవాసమునుగూడ క్రమేణ మనము సంసారములో నున్నప్పుడే యభ్యసింపవలయును. ప్రతి మానవు డాచరించవలసిన మార్గ మియ్యది.

మానవుడు జీవించియుండగనే మంచివాడనిపించుకొనవలయును గదా? మరియు నప్పు డాతడు మంచిమార్గమెలా అనుసరించవగూడదు? అందులకే యనుభవజ్ఞులైన శివశరణులు, మానవుడు బ్రదికియుండగనే వాడు సత్ప్రవర్తనుడయ్యెనా, తాను నివసించునదే కైలాసము లేదా వానికి ప్రతికూలముగా దుష్టవర్తనుడయ్యెనా; తానున్నప్రదేశమే నరకమని బోధించియున్నారు.

ఇది యక్షరశః నిజమైనది. ఏలయన ప్రతివాడు తాను బతికియున్న దినములలో మంచియనిపించుకొనిన వాడు మరణించినపిదప యశః కాయుడు, అమరజీవుడై ప్రకాశించుటను మనము వినుచునేయున్నాము, ఇట్టివి ప్రత్యక్ష ప్రమాణములు.

మానవుడు దన పరిసరమున నుండు వాతావరణమునకు లోబడి తదనుగుణ్యమైన వస్తువులను వాడుకొనిగాని లేదా తదనుగుణ్యమైన యాహారమును భుజించిగాని, దుస్తుల నుధరించిగాని సుఖముగ తన మనుగడను జరుపుకొన్నవాడుగా భావించును, యెల్లప్పుడు సంఘమందున్న వాడు గనుక యేకాకిగానుండుట కిచ్ఛగింపడు గదా?

అట్లుగాక మరికొందఱు ఎత్తైన పర్వతములయొక్క గుహాలయం దుండియో, లేదా ఘనారణ్యమున నొకఅందమైన పర్ణకుటీరము నేర్పఱచుకొనియో, తాముండు నా యాశ్రమమునకు బరిసరములందు. అరటి, మామిడి, జామ, నేరెడి, నిమ్మ, రేగు మున్నగు ఫల వృక్షములతోను. నిరంతరము సువాసనతో ఘుమఘుమలాడు జాజి, పున్నాగ, కరవీర, మల్లె, మొదలగు సుగంధ పుష్పవృక్షములతోను, లతా మండపములతో నొప్పారుచు. తేటగా నుండు పడియల నీటిలో తేలాడు ఎఱుపు మరియు తెలుపు కమలములతోను, నీలిరంగును విరజిమ్ము నల్ల కలవ పువ్వులతో ప్రకాశించు నా ప్రశాంత వాతావరణమున (యరణ్యమృగము లన్నియు తోపోధనుల దవః ప్రభావమున నవి తమతమ వైరభావములు మాని సాధుమృగములతో గలిసి తిరుగు పుండరీకములును). నిత్య హోమము వేదాధ్యయనమును గావించు శిష్యకోటితోడను, జింకలు. లేటి ముద్దరాండ్లు. చెవులపోతులు, మున్నగు సాధు ప్రాణులతోడ నొప్పియుండు, మరియు, శుక, పిక, శారికల కిలకిలా రావములతోను, నీల కంఠముల నృత్యములతోను, కలకంఠములుగల కోకిల కుహూరవములతోను, భ్రమరముల ఝుంకారములతోను, గూడియుండిన ప్రశాంతము. నిర్మలము పరమపవిత్రమునైనట్టి యాశ్రమమున తమ శుద్ధమైన జీవితములను గడుపుచు కేవలము కంద-మూలములచేతను, పండ్లు ఫలహార ములచేతను, నిరంతరము నీశ్వరుని నంస్మరణతోనే కాలమును వెళ్ళబుచ్చు యోగీశ్వరులు రాగద్వేషములతో నిరంతరము కలుషితమైయుండు నీ లౌకిక లోకమునకు రానిచ్ఛగింపరు. గదా! అది వారి నిరంతరాభ్యాసము, మహాపురుషుల నంసర్గముల ప్రభావమువలన వచ్చిన పునీత జీవితమయ్యది.

ఐతే నీ యిరుతెఱగులైన (లౌకిక-అలౌకిక) పైన జర్చింపఁబడిన వీరిరువురి జీవితములోని వ్యత్యాసము చాల గలదు. ఒకరు మరణమే

మహానవమిగా భావించి మిత్తిగొంగయై మృత్యువును దృణీకరించువారౌతే. మరొకరు మరణమునకు వెఱచి మృత్యువునుండి గాపాడుకొనుటకై గావల సినన్ని యత్నములఁ గావించువారు.

మరణమును దృణీకరించువారు జగన్మిథ్యయని భావించి నిర్జన ప్రదేశమున నొక చిన్ని బర్ణకుటీరముననుండి సాధుజీవితమును గడుపుచు పరమాత్ముని ధ్యానముతో తమ పవిత్రమైన జీవుని మేళవించి యంత్య సమయమున నానందముతో బ్రాణములఁబాయుదురు.

కాని మరణమునకు వెఱచువారు జగత్తు సత్యమని భావించి తమ శక్తినెల్లయుపయోగించి "ధర్మార్థకామమోక్షము"లను బురుషచతుష్టయ మున కేవలము అర్థకామములనే ప్రధానములుగానెంచి వానికనుకూల్య మైన మార్గముల జరించి వ్యవహరింతురు. సత్పురుషుల కోవకుజెందిన వారికీ విషయము గిట్టదు. వారికి కావలసినది కేవలము పరమాత్ముని ధ్యానముచే నిహలోకతరణము. పరలోక ప్రయాణము.

కావున నట్టి మహానుభావులు మంచి సూత్రముల నవలంబించి బురదలోని గుమ్మరిపురువులా లోకమున వ్యవహరింతురు. వీరిహమున నున్నంతకాలము సామాన్య మానవుల్లా గోచరించినను వారి యాచార వ్యవహారములు, విచారములు. స్థితిగతులన్నియు వేరు. ఇట్టి యసామా న్యసామాన్యమైన శక్తి మానవుడికి లభించవలెననినచో నేకాంతవాసమే శరణ్యమనక తప్పదు.

ఇక్లేకాంత వాసియైన మానవునికి ప్రశాంతవాతావరణ ప్రభావమువలన సాత్విక గుణములు తమంతటనేయలవడును. సదా సదా శివుని నామస్మరణము గావించుచు నిత్యానందముతో జీవన్ముక్తుడగును.

శ్లో. సర్వే భవన్తు సుఖినః, సర్వే సన్తు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యన్తు, మాకశ్చిద్ దుఃఖభాగ్ భవేత్॥

శివమ్ భూయాత్

ఓం శాంతిః శాంతిః శాంతిః



# పరిచయము



తెలంగాణ మెదకు మండలాంతర్గతమైన అందోలు తాలూక జోగిపేట నగరమున సదాచారసంపన్నులైన వీరశైవ సత్కుటుంబము శ్రీ వీరయ్యగారు మరియు శ్రీమతి నాగమాంబల పుణ్యగర్భశుక్తికయందు వీరు స్వస్తిశ్రీ రుధిరోద్గారి నామ సం॥ 1923 మున జన్మించిరి.

సద్బ్రహ్మచారులు నిరతాన్నదాన ప్రవర్తకులునైన వీరి **జ్యే**ష్ఠ పితృవ్యులు పూజ్యశ్రీ గొల్లాలప్ప (షడక్షరి) మహాస్వాములవారు వీరిని **త**మ సదాశివపేట మరియు జోగిపేట పెద్దమఠముల కుత్తరాధికారిగా **స్వీ**కరించి స్వస్తిశ్రీ రక్తాక్షినామ సం॥ ఫాల్గుణ బహుళ ౧, పాడ్యమి బుధవారమునాడు కారణ సంస్కారము అతివైభవోపేతముగా జరిపించిరి.

పిదప శ్రీ ని. ప్ర. స్వ. విరుపాక్షానంద మహాస్వాములు న్యాయ **వే**దాంత సాంఖ్యయోగ మీమాంసాది శాస్త్రపారంగతులు కోడకల్లు సంస్థానమఠాధీశులు వీరిని సంస్కృతాభ్యాసమునకై మైసూరు ప్రాంత **మం**డలి యాదగిరి, శంకర సంస్కృత కాలేజీకి పంపించిరి, అట వీరు **సం**స్కృతమున సాహిత్యరత్న, కన్నడ ప్రాజ్ఞ, ఎన్ట్రన్సు హిందీభాషల **వ**రకధ్యయన మొనర్చి పట్టభద్రులైరి. ఉస్మానియా యూనివర్సిటీ **M.O.L.** మరియు సం॥ భాషాప్రవీణ పరీక్షలలో నెగ్గియున్నారు.

కొన్నాళ్ళు ధారవాడ పూజ్యశ్రీ మృత్యుంజయ మహాస్వాముల వారి దివ్యసేవకావృత్తిలో నుండి వీరశైవ ధార్మికసిద్ధాంతమును, సాహిత్య సంస్కృతుల నలవరచుకొనిరి, పిదప దమజన్మభూమికి దిరిగివచ్చి శ్రీ గురువుగారి మరియు తల్లిదండ్రుల యాజ్ఞానుసారముగా గృహస్థాశ్రమమును స్వీకరించిరి.

కుటుంబపోషణకై ప్రభుత్వోపాధ్యాయవృత్తి నవలంబించి యున్నారు యవకాశమును బురస్కరించుకొని వీరశైవ సమాజమున కుడుతాభక్తిసేవ జేయుచున్నారు. హై. సికింద్రాబాదు ఉపాధ్యాయ పండిత పరిషత్తునకును ప్రధానకార్యదర్శిగా నుండి సాహిత్యసేవ యొనర్చుచున్నారు.

వీరు స్వభావముచేత నిరాడంబరజీవులు; నిర్మలదయార్ద్ర హృదయులు. సదాచార సచ్ఛీల సద్గుణముల ప్రోవు. వీరశైవ సమాజమునకు సాహిత్య, సాంఘిక, వైజ్ఞానిక, ధార్మికముల ననుసరించి యెల్లప్పుడు వీరు సేవ జేసియున్నారు. చేయుచున్నారు గూడ.

7-3-19[illegible]లో శివానుభవగోష్ఠిని ప్రారంభించి నడిపియున్నారు.

13-4-1960 హైదరాబాదునగరవీరశైవతరుణసంఘాధ్యక్షులుగను

12-3-1963 హై. నగరవీరశైవ సమాజమునకు ఉపాధ్యక్షులుగను

1-12-1965 ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రాచ్యకళాశాల విద్యార్థి సాహిత్య సమితికి హై.కు అధ్యక్షులుగను.

6-8-1967 హైదరాబాదు, సికిందరాబాదు ఉపాధ్యాయ పండిత పరిషత్తునకు ప్రధాన కార్యదర్శిగను.

14-3-1970 నగర వీరశైవ సమాజమునకు ప్రధాన కార్యదర్శిగను.

14-4-1971 జంట నగరముల "ఉపాధ్యాయ పండిత పరిషత్తుకు" రెండవసారి ప్రధాన కార్యదర్శిగను.

13-1-1973 హైదరాబాదు వీరశైవ సాహిత్య-సాంస్కృతిక సంఘాధ్యక్షులుగాను,

ఇట్లాయా సంస్థల ద్వారా ఎన్నుకొనబడి యథాశక్తి సేవలొనర్చుచున్నారు.

*

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు : ముద్రితములు

1. వీరశైవతరుణ గేయములు 0–50
(నూతనపక్కిలో తెనుగు, కన్నడ, హిందీ, సంస్కృతములు)
2. బసవేశ్వరుని తత్త్వములు (సంపాదకీయవ్యాసములు) 0–50
ప్రకాశకులు : వీరశైవసమాజము, సికిందరాబాదు
3. వీరశైవ ధర్మాన్వేషణము 0–50
4. వీరశైవ సమాజోద్యానము జోగిపేట 1–00
(తా. ఆందోలు, మెదక్ జిల్లా)
5. మహాజ్ఞాని చెన్న బసవన్న 0–25
కన్నడమునకు తెనుగుసేత
ప్రకాశకులు : వీరశైవసమాజము, హైదరాబాదు
6. రత్నత్రయము 1–50

## అముద్రిత గ్రంథములు

1. ఇష్టలింగ విజ్ఞానము
2. వీరశైవ ధర్మగతవైభవము
3. స్వప్నతరంగిణి
4. రెండు చిన్ననాటికలు

సూచన : పైగ్రంథములు వలయువారు ఈ దిగువ చిరునామాకు వ్రాయగలరు.


పం. రాచవీరదేవర "తీర్థ" M. O. L.
సంస్కృతాంధ్ర సీనియర్ పండితుడు,
ఇంటి నం. ~~78/ ఎస్. ఆర్. టి. యాకుత్పూర కాలనీ,~~
హైదరాబాదు, 500023 ఆం. ప్ర



Murali Power Press, Hyderabad–500027

ఓం

"సత్యం శివం సుందరం"







# రత్నత్రయము





గ్రంథకర్త:

పెద్ద మఠము పండిత రాచవీరదేవర "తీర్థ" (కలకత్తా)

M O L. ఉస్మానియా యూనివర్శిటీ

సాహిత్యాలంకార్, భాషాప్రవీణ, హిందీ భూషణ,

కన్నడ "జాణ" సంస్కృతాంధ్ర సీనియర్ పండితుడు.